# డా॥ రాధశ్రీ జీవనరేఖలు

(BIO-DATA OF Dr. RADHASRI)

[illegible]

1. పేరు : రాధశ్రీ (పిడుగు అనంత వేంకట రాధా కృష్ణ ప్రసాద్)
2. జననం : 19-10-1958 (దుర్గాష్టమి) పిడుగురాళ్ల (గుంటూరు జిల్లా)
3. చదువు : ఎం.ఎ.,ఎం.కాం., పిహెచ్.డి., CAIIB
4. ఉద్యోగం : సీనియర్ మేనేజర్ సిండికేట్ బ్యాంక్.
5. చిరునామా : 3-7/2 శివశక్తి సాయి కాలని, నాగారం, ECIL 'X' Road, హైదరాబాద్ - 500083.
6. ఫోన్లు : 040-2712 4874, 94904 39758.
7. సాహితీ వ్యాసంగం : 1975 నుండి
8. బిరుదులు : ధారణా వాచస్పతి, సాహితీ యువరత్న
9. ప్రచురిత రచనలు : తారామతి - ప్రేమావతి (కథాత్మక గేయకావ్యం), ఆర్య చాణక్య (ఏకపాత్రాభినయం), కవితా కృష్ణవేణి (కవితా సంకలనం), విజ్ఞాన గీత (గేయంలో విజ్ఞానం), రాధశ్రీ రసగుళికలు (మినీ కవితలు), బాలభక్తులు.

పద్య శతకాలు

చెన్నప్ప శతకం, వత్సల్ వాణి శతకం, రాధశ్రీ రత్నశతకం, రాజేశ్వరీదేవి శతకం, లక్ష్మీనృసింహ శతకం, శశిమౌళి శతకం, నాగలింగ శతకం, పెరుమాళ్ళ శతకం, చెన్నప్ప ద్విశతి.

# చెన్నప్ప ద్విశతి





కృతికర్త:

డా॥ రాధశ్రీ

# చెన్నప్ప ద్విశతి

డా॥ రాధశ్రీ

ఆత్మీయ మిత్రులు, 'ఆర్షకవి' ఆచార్య మసన చెన్నప్పగారు అమెరికాలోని షికాగాలో 02-07-2009 నుండి 04-07-2009 తేదిలలో జరుగుతున్న తానా మహాసభలలో పాల్గొంటున్న సందర్భంగా ఈ కృతి వెలువరింప బడింది.

ప్రచురణ

**అమృత లక్ష్మీ ప్రచురణలు** హైదరాబాద్

CHENNAPPA DWISHATHI

By

**Dr. Radhasri**



ప్రచురణ సంఖ్య :16

ప్రథమ ముద్రణ : 2009

ప్రతులు : 1000

మూల్యం :

ప్రతులకు :

**Dr. Radhasri**
3-7/2, Siva Sakti Sai Colony,
Naagaaram (Near Kushaiguda)
E.C.I.L. Hyderabad - 500 083
Phone: 040-27124874
Cell: 94904-39758

Designed & Printed by:
**Mounica Graphics**
1-4-27/71/187, Padmashali Colony,
Kavadiguda, Secunderabad.
Ph: 93910 41545

భారత భాషాభూషణ్, కవితిలక
**డా॥ తిరునగరి**
6-17 5 డి.నగర్, గణేష్‌నగర్, చింతల్ HMT
హైదరాబాద్ - 500054
సెల్: 9392465475

## జయంతితే.....

డా॥ రాధశ్రీ జగమెరిగినకవి. జనం మెచ్చినకవి. ఆశుకవిత్వం చెప్పడం ఆయనకు నల్లేరుపై బండినడక. కంద పద్యరచనలో నిష్ణాతులు. కందకవి సార్వభౌములుగా విఖ్యాతి నార్జించారు. డా॥ రాధశ్రీ ధారణాశక్తి అద్భుతం. ప్రాచీనార్వాచీన పద్యకవిత్వంలోని మణులు ఆయన మేధలో పదిలం. ఆయన పుష్కల వాక్చతురత్వం మధుర మధురంగా వినసొంపుగా ఉంటుంది.

డా॥ రాధశ్రీ విద్వత్కవి. 19-10-2008న ఆయన హైదరాబాదు నగరంలో చేసిన 12 గంటల పద్యధారణ సభ సారస్వతీయుల, సహృదయుల అభినందనల నందుకొన్నది. ఇప్పటికే అసంఖ్యాకంగా రసవత్కృతులను రచించి కవితా ప్రపంచంలో తనదైన ముద్రను వేసిన డా॥ రాధశ్రీ కృతులలో విశిష్టమైనది చెన్నప్పశతకం. కందాలలో అందంగా, మధురస నిష్యందంగా, పరితృలోక సంస్పందంగా ఈ పద్యాలను రచించారు.

ఆచార్య మసన చెన్నప్ప గారి పేరు తెలియని తెలుగు సాహితీపరులుండరు. కవిగా, విమర్శకుడుగా, వక్తగా, ఆచార్యుడుగా ప్రఖ్యాతి నార్జించిన చెన్నప్పగారు మానవతామూర్తి, నాకు హితులు, సన్నిహితులు, హిమస్వచ్ఛ హృదయులు. ఉపనిషత్తులను గీతాలలోకి అమృతమధురంగా ఆంధ్రీకరించిన ఆర్షకవి. అంతటి విద్వద్వతంసులు అయిన చెన్నప్పగారిపై డా॥రాధశ్రీ వంద పద్యాలు రచించారు. గతంలో రచించిన వంద పద్యాలుచేర్చి **'చెన్నప్ప ద్విశతి'**ని ఇప్పుడు వెలువరిస్తున్నారు. ఓ విద్వన్మణిపైన ఓ విద్వత్కవి రచించినదీ విశిష్ట కృతి. ప్రతి పద్యమూ హృద్యం. అనవద్యం. ప్రతి పద్యమూ

ఉదహరించవలసినదే. మహాకవి చెళ్లపిళ్లలాగా 'కవనార్థమునే బుట్టితి'నని చెప్పిన డా॥రాధశ్రీ నాకు అభిమానకవి. ఆయన కందాలు మధురమాకందాలు. ఈ చెన్నప్ప ద్విశతిలోని ప్రతిపద్యము అందుకు సాక్ష్యం. డా॥ రాధశ్రీ నవకృతికి ఆహ్వానం పలుకుతూ ఈ యువమహాకవికి ఉజ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తున్నాను.

**జయంతితే సుకృతినో**
**రససిద్ధా కవీశ్వరాః**

**- తిరునగరి**

కం॥ కరి వరదుని సత్కృపగా
**తిరునగరి** సముద్భవించె తెలగాణమునన్
సరసాత్ముడైన కవియని
కరయుగమును మోడ్చుచుంటి కందములోనన్.

డా॥ రాధశ్రీ



శ్రీకరమగు గుణములతో
శ్రీకారము చుట్టి పనులు చేసెడి వారిన్
శ్రీకాంతుడెల్లవేళల
గైకొని రక్షించుచుండు కవి చెన్నప్పా! 1

స్థిరమగు భక్తిని జూపుచు
మరవక తన తల్లిదండ్రి మాటలు విను ఆ
కరివదనుని నే గొలిచెద
కరయుగమును మోడ్చి మనన కవి చెన్నప్పా! 2

వాణిని, అచ్యుత సూనుని
రాణిని, ఆశీస్సులొసగ రసకవితల పూ
బోణిని, తల్లిని, సుందర
వేణిని కొనియాడకుందువే చెన్నప్పా! 3

వరవీణామృదుపాణిని
వరమీయగ కోరినాడ, భాసుర కవితా
ఝరిలో మునుగుచు యశమున్
స్థిరముగ సాధింపవలయు శ్రీ చెన్నప్పా! 4

ఘనకవితామూర్తులకే
జననిగ చెలువొందు వాణిచరణయుగమ్మున్
మనమున నిరతము దలచుచు
వినిపింతును పద్యములను విను చెన్నప్పా! 5

అనయము విద్వన్మణులను
కనురెప్పై కాచు వాణి కమ్మని రూపం
బనిశము భక్తిందలచుచు
వినిపించెద కందములను విను చెన్నప్పా! 6

వీణాపాణిని గొలుచుచు
జ్ఞానాన్విత పీఠమెక్కి జ్ఞానప్రభలన్
నానా దిశలం జల్లెడి
సీనారాయణుని గొలుతు శ్రీ చెన్నప్పా! 7

కసిరెడ్డిపైన ఉత్పల
పసగలిగిన రెండునూర్ల పద్యములల్లెన్
రసికులు మెచ్చగ మీపై
సిసలగు శతకమ్ము వ్రాతు శ్రీ చెన్నప్పా! 8

శ్రీరామనవమి రోజున
నోరారగ మాటలాడి నూతనగతి సొం
పారెడి కందములందము
గా రచియింప గలిగితిని కవి చెన్నప్పా! 9

నాలుగు మాత్రల పదములు
నాలుకపై నాట్యమాడి నను మెచ్చుంగన్
లీలగ కందములల్లితి
కాలమ్మునకెదురు నిలిచి కవి చెన్నప్పా! 10





కందాలలోన తొణికెడి
అందాలకు మేను మరచి ఆనందముతో
డెందము స్పందన పొందగ
చిందించెద మధురకవిత శ్రీ చెన్నప్పా! 11

అందమ్మగు భావమ్మును
కందమ్మున చెప్పుచుంటి కమ్మని రీతిన్
నందనమది! చందనమది!
వందనమిదె స్వీకరింపవలె చెన్నప్పా! 12

భావము వైదికమనగా
పావన నిర్ఝరిని బోలి ప్రవహించెడి నీ
జీవనమే సారస్వత
సేవకు మరి అంకితమ్ము శ్రీ చెన్నప్పా! 13

చెన్నుడు మాచెర్ల పురిన,
చెన్నుడు బేలూరు నందు చెలువొందగ, మా
చెన్నుడు కలడీనగరిన
చెన్నుడు నా స్ఫూర్తిదాత శ్రీ చెన్నప్పా! 14

మల్లీశ్వరిలో దేవుల
పల్లిని నే చూసినాడ ప్రతిభదలిర్పన్
మల్లి పదంబుల కొలుకుల
పల్లీశుని మనసు నేను పట్టితి చెన్నా! 15

మహనీయమనగ, పండితు
లహరహమును మెచ్చునట్టి అద్భుతకవితా
మహలనగ 'బృహద్గీత' ను
సెహబాసుగ పలికినావు శ్రీ చెన్నప్పా! 16

సభ్యసమాజమునకు సౌ
లభ్యముగా ఉపనిషత్తు రచియించితివో
అభ్యుదయమ్మనగ నిహప
రాభ్యుదయమె నీ తలంపయా చెన్నప్పా! 17

నిత్యము జీవితమందున
సత్యాన్వేషణ ముసేయు సచ్ఛాత్రుడవై
స్తుత్యుడ వైతివి సత్సాం
గత్యములో మెలగునట్టి కవి చెన్నప్పా! 18

కొలుకులపల్లిం బుట్టియు
కలరవములతోడ మధురగానము చేస్తూ
పలుకుల తల్లికి ముద్దుల
నొలికించెడి సుతుడవైతివో చెన్నప్పా! 19

మండే సూర్యుని సైతము
పాండిత్యప్రభలతోడ భయపడజేసెన్
గుండేరావ్ పండితుడత
డుండును నీ గుండెలోన ఓ చెన్నప్పా! 20





చదివించెనుపనిషత్తులు
చదివించెను శాస్త్రములను సత్యముదెలియన్
ముదమొప్ప గోపదేవుడు
కదలగ సత్పథమునందు కవి చెన్నప్పా! 21

నా మనసు మెచ్చు రీతి న
సామాన్యంబైన ఆర్షసాహిత్యముతో
ప్రేమాస్పదుండ వగు నీ
కామితమును తెలిసినాను కవి చెన్నప్పా! 22

కష్టములెన్నో గడచియు
నిష్టంబగు విద్యగఱచి యాశునికొరకై
అష్టాంగయోగమున సం
విష్టుడు గావలయునరుడు విను చెన్నప్పా! 23

ఆనందమూర్తి గురువున
కానందము కలుగుజేసి యలవోకగ నీ
వానందవర్ధనాథుల
జ్ఞానమ్మును ముట్టినావు సఖ! చెన్నప్పా! 24

గురజాడగోల్డు మెడలుకు
సరియగు నభ్యర్థి వీవె చక్కని యమృత
స్వరములతో ఆంధ్రమ్మున
స్థిరకీర్తిని పొందగలవు శ్రీ చెన్నప్పా! 25

మెల్లగ గుండెను దాకెడి
చల్లని మల్లియల వింత సౌరభములతో
మల్లిపదాలను చెలువుగ
అల్లిన మీ ప్రతిభ మెచ్చునా చెన్నప్పా! 26

మాత్రాఛందస్సులకే
మాత్రమ్మును తీసిపోని మాదిరిగా మీ
నేత్రోదయమ్ము నడిచెన్
స్తోత్రము కాదిది నిజమ్ము సుమి చెన్నప్పా! 27

కన్నడ భాషను నేర్చితి
మున్నెన్నడు లేనిరీతి ముదమలరంగన్
'చెన్నాగిదిరా' యని మిము
కన్నడమున పలకరింతు కవి చెన్నప్పా! 28

'చెన్నాగిదిరా' యన బా
గున్నారా యనియె, తేనె లొలికెడి రీతిన్
మిన్నగ కుశలములడుగుట
కన్నడి గుల సభ్యతగును కవి చెన్నప్పా! 29

కవనార్థమె నేబుట్టితి
కవనమె నా ప్రాణమనుచు కడువేడుకతో
కవితారాధన చేతువు
కవితల్లజులిచ్చుమెచ్చు కవి చెన్నప్పా! 30





మీ కభినందనలివిగో
చేకొని సత్కీర్తితోడ చెలువొందదగున్
లోకులు మెచ్చెడి కవితా
లోకమె నాకమ్ము ధరణిలో చెన్నప్పా! 31

కోటలు కట్టిరి రాజులు
మూటలు కట్టిరి ధనికులు – ముదమున కవులున్
మాటలు కట్టిరి – జగమున
మాటల మూటలె మిగులును మరి చెన్నప్పా! 32

ఇటుచూసిన పద్యకవులు
నటు చూసిన వచన కవులు నానందముతో
పటుతరమగు మీ కవితా
పటిమను కీర్తించినారు భళి, చెన్నప్పా! 33

ఎగదన్నిన కావరమున
పగనిండిన మనసుతోడ పాండిత్యమునే
ఎగతాళి సేయు వారల
సిగదరుగుము ప్రతిభచేత శ్రీ చెన్నప్పా! 34

శతకములో ప్రతి పద్యము
పతకము వలె మెఱయుచుండు ప్రతిభదలిర్పన్
గతుకుల పథమును బోలెడి
బ్రతుకున పన్నీటిజల్లు పద్యమె చెన్నా! 35

పదములు వేవిధముల నా
పదయుగళిని కడిగి కడిగి ప్రార్థన చేసెన్
'విదుడవు మమ్మిక చేకొని
కదమును త్రొక్కించు' మనుచు కవి చెన్నప్పా! 36

మాటలు చెప్పను ప్రజలకు
సూటిగ చెప్పెదను కవిత, శుభదాయకమై
ధాటిగ కొనసాగంగా
ఓటమి లేనట్టి రీతి ఓ చెన్నప్పా! 37

పద్యములో మాట్లాడెద
పద్యమె నా హృదయమనుచు, పండితలోకం
బుద్యమముగ పద్యముగొని
హృద్యము గావింపవలయు శ్రీ చెన్నప్పా! 38

ఉద్యమము లేవదీసెద
పద్యముకై పదితపించు ప్రాణహితులతో,
హృద్యమ్మగు జగమందలి
విద్యలలో పద్యవిద్య విను చెన్నప్పా! 39

ఉరుకులతో పరుగులతో
సరిగమలను పాడి సస్యసంపదలిచ్చే
పరహితమతియగు గోదా
వరివలె పద్యమ్ము నడపవలె చెన్నప్పా! 40





దుష్కరమగు ప్రాసలతో
ముష్కిల్ లేకుండ పద్యముల్ రచియింతున్
లష్కరువాసా! పూర్ణా
యుష్కుడవై వృద్ధిగాంచు మో చెన్నప్పా! 41

కిలకిలమనియెడి రవముల
కలకల లాడంగ వనము కమ్మగ నెలకో
యిల పలురీతుల గీతులు
చిలికించును నిన్నుబోలి శ్రీ చెన్నప్పా! 42

హల్లో యనగానే ఊ
హల్లో విహరింపచేయు ఆత్మీయతతో
అల్లెదను పద్యకవితల
నుల్లము ఝల్లనెడి రీతి ఓ చెన్నప్పా! 43

హుందాయి కారునందున
హుందాగా కూరుచుండి హాయలొలికిస్తూ
అందాలు చిందులేయగ
కందాలే వ్రాయగలను కవి చెన్నప్పా! 44

అక్కన్న పేట లోపల
క్రిక్కిరిసిన జనులమధ్య క్రీడాస్ఫూర్తిన్
చక్కని రసబుక్కులనే
నొక్కని వినిపించినాడ నో చెన్నప్పా! 45

బిలబిలమంటూ వత్తురు
వెలకట్టగలేని కవిత వినిపించంగా
తలమడ్ల స్టేషనందున
కలవారలు నేడుకూడ కవి చెన్నప్పా! 46

వెళ్ళేది దోమకొండట!
మల్లాలట బేసికు కడ, మరి మరి మేనే
త్రుళ్లగ, నేనేం జేతును
కళ్ళింతలు చేసి గాంత్రు కవి చెన్నప్పా! 47

వడియారమందు నేనొక
గడియారము కొనదలంచి గాలించంగా
వడివడిగ కొట్టుకొనియెడి
గడియారము దొరికె నాకు కవి చెన్నప్పా! 48

బొల్లారమందు నేనొక
గల్లీలో నిలిచి పద్యకవితను చదువన్
గల్లీయులెల్ల వచ్చిరి
కల్లగ భావింపవలదు కవి చెన్నప్పా! 49

ఆర్టీసి బస్సునందున
మార్టూరుకు వెళ్ళుచుండ - మార్గముననొకం
డార్టిస్టు కలిసి, నాపై
కార్టూనును వేసినాడు కవి చెన్నప్పా! 50





పొన్నూరు పట్టణములో
కన్నులు మిరిమిట్లు గొలుపు కాంతుల మధ్యన్
మన్ననలందుచు జెప్పితి
చెన్నాంకిత పద్యములను శ్రీ చెన్నప్పా! 51

ఓబులు వేసిన పల్లె జి
లేబులపై ప్రేమ గలిగి లే బ్రాయములో
డాబుగ తిరిగిన వాడను
జేబులలో చేతులుంచి శ్రీ చెన్నప్పా! 52

యెల్లెసు వరల్డునందున
నుల్లము ఝల్లనెడి రీతినుత్సాహముతో
పిల్లల మధ్యన నేనును
పిల్లడినై గెంతినాను విను చెన్నప్పా! 53

శ్రీమత్కేశవ తీర్థులు
ప్రేమగ నాకిడిన భక్తి పీయూషమ్మున్
మైమరచి గ్రోలినాడను
కామిని నేగాను మోక్షగామిని చెన్నా! 54

గ్రామగ్రామము దిరుగుచు
గ్రామీణుల బాగుదెలిసి కడుశ్రమతోడన్
ప్రామాణిక గ్రంథము నే
కామర్శున వ్రాసినాను కవి చెన్నప్పా! 55

నేతను, భారత భాగ్యవి
ధాతను, స్వేచ్ఛాఫలప్రదాతను, జేతన్,
త్రాతను, మోహన గాంధీ
తాతను తలపోతు సంతతము చెన్నప్పా! 56

పలనాటి బాలచంద్రుడు
వెలకట్టగ లేని రీతి వీరము చూపెన్
తులలేని దేశభక్తికి
కలకాలము గుర్తతండు కవి చెన్నప్పా! 57

నన్నయ, తిక్కన, ఎఱ్ఱన
మిన్నగ పద్యములు వ్రాసి మేదినిలోనన్
వన్నెల చిన్నెల కవితా
కన్నెలను వరించినారు కవి చెన్నప్పా! 58

శ్రీ విశ్వనాథ సత్కవి
కావించిన రామకథను కల్పతరువుగా
భావించుటసరి, తెలుగున
జీవము గల రచన యదియె శ్రీ చెన్నప్పా! 59

అభ్రోచి మార్చుకొనుచును
అపూర్వుడు గతులలోన అవధానములో
అప్రస్తుతముగ శ్రీశ్రీ
సిప్రాలిని వ్రాసినాడు శ్రీ చెన్నప్పా! 60





భద్రమ్మగు తన కవితా
ముద్రను సాహిత్యమందు మోదముతో ఆ
రుద్ర కవీశుడు భావస
ముద్రుండై నిలిపె దివ్యముగ చెన్నప్పా! 61

అంగారము, శృంగారము
పొంగారగ దాశరథియు పూజించెనుగా
బంగారు పద్యములతో
సింగారముగాగ వాణి, శ్రీ చెన్నప్పా! 62

చవులూరించెడి శైలిన్
నవపథమున భవ్య కవిత నడుపుచు మహిలో
శివభారతమ్ము మలచెను
కవివరుడగు శేషశాస్త్రి కవి చెన్నప్పా! 63

దుబ్బాక రాజశేఖరు
డబ్బురమగు ప్రతిభతోడ నందించె జగం
బుబ్బగ వీర రసాద్భుత
కబ్బమ్ము ప్రతాప చరిత కవి చెన్నప్పా! 64

గుడిపాటి వేంకటాచల
మడుగిడె వాఙ్మయమునందు - అబలలనంటే
యిడుముల తొలగించుటకై
నడిరాతిరిలో వెలుంగనన్ చెన్నప్పా! 65

హాస్యము కొరవడి బ్రతుకవ
హాస్యమ్మగు రోజు వచ్చె, హాయిగ నవ్వే
ఆస్యమ్మే కరవాయె ను
పాస్యము హాస్యము జనులకు భళి, చెన్నప్పా! 66

మనసైన మంచి హాస్యము
మన తెనుగుల కందజేసి మరిమరి నీచే
కొనియాడబడిన రచయిత
ముని మాణిక్యమ్ము హాస్యముని చెన్నప్పా! 67

జవసత్వంబులు నింపుచు
కవితల్లజుడైన ఇంద్రగంటి తెనుగునన్
ప్రవిమల దాక్షారామ సు
కవితను వెలయించినాడు కవి చెన్నప్పా! 68

విశ్వమ్మెల్లయు పొగడగ
విశ్వమ్మున తెలుగు కీర్తి విరియించెనుగా
విశ్వశ్రేయముకోరెడి
విశ్వంభర కావ్యకర్త విను చెన్నప్పా! 69

గంధము పూతగ, నవరస
బంధురమగు గానసుధను పంచుచు స్వరసం
బంధముచే వెలుగొందెడి
గంధర్వుడు బాలమురళి కవి చెన్నప్పా! 70





నండూరి రామకృష్ణుడు
నిండగు గోదారి భంగి నిర్మలమతితో
దండిగ పద్యము నడిపెడి
పండితుడనుచు నెరుగంగవలె చెన్నప్పా! 71

గురువై, కవితాచందన
తరువై నాకెపుడు మార్గదర్శకులగుచున్
వరలెడి తిరుమలవారికి
కరయుగమును మోడ్చుచుంటి కవి చెన్నప్పా! 72

శ్రీ పోతుకూచి ధన్యుడు
దాపరికము లేని కవిత తన్ను వరించెన్
గోపాలకృష్ణుడాతని
కాపాడును గాక నెపుడు కవి చెన్నప్పా! 73

నాయని కృష్ణకుమారికి
నాయన పాండిత్యమబ్బె నవ కవితగ నో
హో యను రీతిగ వ్రాసెడి
ఆయమ కివె వందనమ్ములగు చెన్నప్పా! 74

వేగమ్ముగ అవధానపు
యాగము ఘటియించి సోమయాజిగ వెలిగే
నాగఫణీంద్రుని ముందర
ఆగగ మరి శక్యమెవరికగు చెన్నప్పా! 75

అష్టావధాన కళలో
కష్టము లేకుండ వెలుగు కవి ఎవరన్నా?
ఇష్టుడగు గరికపాటి వి
శిష్టునినే గొలుతు నెపుడు శ్రీ చెన్నప్పా! 76

ఏలూరిపాటికి పురా
ణాలన్నను ప్రేమ, అతడు జ్ఞానాంబుధియై
వేలాదిమంది సై యన
గా లెక్చర్లిచ్చు మసనకవి చెన్నప్పా! 77

పసిపాప నవ్వువోలెను
వసివాడని పువ్వురీతి వాసగకవితల్
రసికులకందించెడి మన
కసిరెడ్డికి మ్రొక్కుచుంటి కవి చెన్నప్పా! 78

బోధన తన పనియైనను
సాధన సాహితి స్రవంతి స్థాపించి స్వరా
రాధన గావించెడి యా
సాధన నరసింహునకును జై చెన్నప్పా! 79

ఆధునికోత్తర వాదము
వ్యాధిగ ప్రబలినది నేడు, వాగర్థమ్ముల్
శోధించిన జతకూడవు
రాధశ్రీ వ్రాయడట్టులన్ చెన్నప్పా! 80





బుర్ర పనిచేయకుండిన
వెర్రిగరచనలను చేసి వేవిధములుగా
వర్రీలకు గురిచేసెడి
సర్రియలిజమేలమనకు సఖ, చెన్నప్పా! 81

ముప్పది నాల్కలు సాచుచు
ముప్పూటలు కాటువేసి ముద్దులతోడన్
టిప్పణి చెప్పెడి కేబుల్
చొప్పడని గృహంబులేదు సుమి చెన్నప్పా! 82

దర్శించు వారలుండగ
దర్శకులకు దారి దొరికె దానిన్ దీనిన్
దర్శింపజేయ, మూర్ఖుల్
వర్షింతురు డబ్బు విరగబడి చెన్నప్పా! 83

కలరందురు అధికారులు
కలరందురు క్లర్కులెల్ల, కనిపించక నే
కలవరపడి నీలదీయగ
కలరందురఫీషియలుగ కవి చెన్నప్పా! 84

బలవంతులు బలహీనుల
పలువిధముల బాధవెట్టు పాలన గలుగన్
విలువేది ప్రజల ఓటుకు?
వలదీ సంకుచిత ప్రభుత వరకవి చెన్నా! 85

మయసభలో పఠియించెనొ?
నయవంచన కోర్సులోన నకిలీ డిగ్రీ
భయపెట్టి పొంది కులికెడి
జయలలితకు కలిగెశాస్తి జై చెన్నప్పా! 86

సినిమా హీరో హీరో
యిను లొక డ్యూయెట్టు పాడ ఏహ్యమె కలుగున్
వెనుకను గెంతెడి మందను
కనినంతనె డోకు వచ్చు కవి చెన్నప్పా! 87

సకిలించుచు నమ్మాయిల
నికిలించెడి కుర్రకారు నేమనవలయున్
వికటించిన దాధునికత
ప్రకటమ్మె కండకావరము – చెన్నప్పా! 88

సారీలను విని విని వే
సారిన ఒక పడతి ప్రియుడు సంభాషణలో
సారీ అన్నపుడల్లా
శారీ కొనుమనె, సతులకు జై చెన్నప్పా! 89

అపకీర్తిని లెక్కింపక
విపరీతపు పోకడలకు విలువనొసంగే
కపులభివాదము సేయగ
కపులుగ వర్ధిల్లుడంటి కవి చెన్నప్పా! 90





పంటకు వచ్చిన పొలమును
కంటికి నింపైన రూపు, కమ్మని స్వరమున్
వెంటను లక్షలు తెచ్చెడి
గుంటయుబాగుండదనును గుంటడు చెన్నా! 91

సంగమహేశ్వరమున నొక
జంగమ దేవరను చూసి సంతోషముతో
రంగని గురించి అడిగిన
లింగని కీర్తించె బాపురే చెన్నప్పా! 92

పాశర్లపూడిలోపల
ఆశించిన రీతి 'గ్యాసు' అందకపోగా
నాశము కలిగించినదా
కాశమ్మును దాకి మంట కవి చెన్నప్పా! 93

ట్రాఫిక్‌లో బంధీలై
సాఫిగ నిలుచేరలేక సతమతమవుతూ
ఆఫీసు నుండి వచ్చిన
మాఫీ కాదయ్య తప్పు మరి చెన్నప్పా! 94

ట్రాఫిక్కులోన చిక్కిన
బేఫికరుగ నుండ గలమె భీతిలకుండన్
సాఫిగ నడవదు బండియు
లైఫుకు సెక్యూరిటేదిలన్ చెన్నప్పా! 95

సిబ్బంది యెక్కువైతే
ఇబ్బందులు గలుగు, పిదప ఏమఱుపాటే
సిబ్బంది నావహించును
క్లబ్బగు కార్యాలయమ్ము కవి చెన్నప్పా! 96

విస్మయమును కలిగించును
ఉస్మానియ ఆర్ట్సు భవన మొక్కటి తన మం
దస్మితమగు వదనము నా
కస్మికముగ జూతురేని కవి చెన్నప్పా! 97

శ్రీయుతుడై, ధీయుతుడై
శ్రేయము లందించు భవుడు చిన్మయమొప్పన్
తీయని పద్యము వ్రాయగ
చేయూత నొసంగు నాకు శ్రీచెన్నప్పా! 98

మెప్పించెద పండితులను
గొప్పగ నిర్మించి భావగోపుర చయమున్
ఎప్పటి వలె వర్షించెద
చిప్పిల్లగ కవన ధార కవి శ్రీచెన్నప్పా! 99

భావావేశముతో బృం
దావనమును కలయజూచు తరుణిగ దోచే
జీవద్భాషను వాడుచు
కావించెద పద్య రచన కవి చెన్నప్పా! 100





వీడను వేదపథమ్మును
ఆడనసత్యమును, పెద్ద ఆపదనైనన్
కూడను నేనన్యాయము
వాడను పరుషమ్ము లెపుడు పండిత చెన్నా! 101

వచన కవిత్వము నందున్
రచయితగా పేరు దెచ్చు రచనలు చేతున్
సుచిరంబగు భావంబును
వచియింతును పద్యమందు భళి చెన్నప్పా! 102

కవితా ప్రపంచ మందున
కవివర్యులు వ్రాసినట్టి కమ్మని కవితల్
చెవులకు విందుల నొసగుచు
చవులూరించెడి విధమున చదివెద చెన్నా! 103

వాడుక భాషను సతతము
వాడెద పద్యాలలోన వాడి స్ఫురింపన్
నేడే కవిపండితులను
వేడెద సంక్లిష్ట భాష విడువగ చెన్నా! 104

అరువదినాలుగు మాత్రలు
అరువదినాలుగు కళలుగ నాశ్చర్యమిడన్
సురలోకము భువిదించెడి
గరువము కందమున గలదు కవి చెన్నప్పా 105

వినసొంపగు పలుకులతో
మనసుల నూయల లూపు మహితోక్తులతో
నినదించును పద్యములో
ఘనముగ కవితా ప్రసాదు కవి చెన్నప్పా! 106

పదుగురు మెచ్చెడి విధముగ
పదములు సమకూర్చుకొనుచు ప్రావీణ్యముతో
కదలగ నెంచితి ముందుకు
పదిలమ్ముగ వాణి మెచ్చ పండిత చెన్నా! 107

పద్యమె నాకాహారము!
పద్యమె నాపసిడి మేడ! భాస్వంతంబౌ
పద్యమె నాకాహార్యము!
పద్యమె నాజీవితంబు పండిత చెన్నా!! 108

శాంతాకారుల చరితలు,
క్రాంతి కిశోరుల ఘనతలు కమ్మనిరీతిన్
స్వాంతమున నిలుపు టీ.యల్.
కాంతారావును నుతింతు కవి చెన్నప్పా! 109

శివరాత్రి పర్వదినమున
నవపథమున జీవితమును నడుపుట కొరకై
నవరసముల కధిపతియగు
భవహరు నుతియింతు నేను పండిత చెన్నా! 110





ఎస్వీరామారావు య
శస్విగ వెలుగొందుగాక సాహిత్యములో
సుస్వరముల సత్కవితా
సుస్వనమును చేత బూని సుమి చెన్నప్పా! 111

చాయీ, నాస్తా, పానీ
కాయమ్మున కూరడింపు కర్మిష్ఠులకున్
మాయని హృది గాయములను
ఖాయమ్ముగ మాన్పు కవిత – కవి చెన్నప్పా! 112

దసరా పర్వదినంబున
పసగలిగిన పద్యములను ప్రపచించుచునే
రస విదులగు తమ కొసగెద
రసమేకద కావ్యమందిరము చెన్నప్పా! 113

దీపావళి శుభదినమున
పాపాళిని రూపుమాపి, పరమాత్ముడు స
త్యాపతి పలు శుభములనిడి
కాపాడునుగాక మనల కవి చెన్నప్పా! 114

కరిముఖుని, విఘ్ననాథుని
కరిచర్మాంబరుని సుతుని, ఘనవిజ్ఞానిన్
వరముల నొసగెడి దేవుని
కరుణాత్ముని కొలుచుచుంటి కవి చెన్నప్పా! 115

విఘ్నేశుని పూజింపగ
విఘ్నమ్ములు తొలగిపోయి విధులన్నియు ని
ర్విఘ్నమ్ముగ జరుగగలవు
విఘ్నేశుని తప్పకుండ వేడుదు చెన్నా! 116

హ్యాపీ దీపావళియని
ఈ పద్యము చెప్పుచుంటి నీశునికరుణన్
దీపావళి సంతోషపు
రూపావళి లోకమునకు రూఢిగ చెన్నా! 117

కందమనగ నాకిష్టము,
చందనమును పూసుకొన్న చందమగును నా
కందాల తెలుగు కందము
నందల మెక్కించుచుంటి నయ్యా చెన్నా! 118

అసలైన కవిత్వమనుచు
పసగలిగిన ఒకటి రెండు పదములతోడన్
రసరుక్కులు వెలయించితి
సిసలగు భావములు గూర్చి శ్రీచెన్నప్పా! 119

దర్పము గల కవితాసం
తర్పణ చేసెను సినారె తనదగు శైలిన్
దర్పణ మయ్యెను తెలుగుకు
కర్పూర వసంతరాయ కావ్యము చెన్నా! 120





నవ్వని పువ్వును సైతము
నవ్వించెను మన సినారె, నవభావమ్ముల్
రువ్వుచు, కవితాకన్యను
దువ్వుచు, చీకటులు పారద్రోలెను చెన్నా! 121

కవిజాతి రత్నమగుచును
ప్రవచించెను నూత్నరీతి పదబంధములన్
స్రవియించగ కవితాసుధ
కవియై రాజిలె సినారె, కవి చెన్నప్పా! 122

తారామతి ప్రేమావతి
తీరుగ పేరొందినారు తేజోమయులై
వారల చరితను కవితా
ధారగ వెలయించినాను ధరపై చెన్నా! 123

సంబారము లందించిరి
సంబరములు చేసినాకు స్వాగత మిడుచున్
అంబరమును చుంబించిరి
"అంబారీపేట" లోని యనఘులు చెన్నా! 124

"అంచానూరు"కు నేనొక
పంచాయితి తీర్పబోయి బడలిక చెందన్
పంచాయతనము నందలి
పంచామృతమొసగినారు భళి చెన్నప్పా! 125

"భికనూరు" గ్రామమందున
చకచకమని నడుచుచుండ సాహిత్యాత్ముం
డొకడభినందన మనుచు ర
సికతను ప్రకటించినాడు శ్రీచెన్నప్పా! 126

ఉదయము రసహృదయముతో
ముదమొందుచు నేను "గొట్టిముక్కల" వెళ్లన్
పదకవితలు చెప్పుదనుచు
మదవతులే అడిగినారు మరి చెన్నప్పా! 127

షెల్లిని, కీట్సును తలపగ
నుల్లము ఝల్లనెడిరీతి నుద్వేగముతో
మల్లెలను బోలు కవితల
నల్లెను మన కృష్ణ శాస్త్రి అలరగ చెన్నా! 128

ఆగ్రాలో జరిగిన శిఖ
రాగ్రసమావేశమందు నధినాయకులున్
ఆగ్రహముల విడనాడగ
ఆగ్రామణు లాదరించి రయ్యా చెన్నా! 129

ఉల్కగ రాలెను కీర్తి తె
హల్కా అందించినట్టి ఆధారముతో
పల్కులు ముల్కులు కాగా
వల్కలములు చినిగిపోయెనయ్యా చెన్నా! 130





చదివించగ తమ రచనలు
చదివితి ప్రతి యొక్క రచన-సంబరమున నే
చదివితిని పెక్కు మారులు
చదివితి తమ రచనలన్ని సత్కవి చెన్నా! 131

భక్తుల జీవిత చరితల
రక్తిం బఠియించినాడ! రసరమ్యమ్మౌ
ముక్తకములలో ముక్త్యభి
షిక్తుల దర్శించినాడ! శ్రీచెన్నప్పా! 132

మరలా వచ్చెను వరదలు
ఒరియా భూభాగమందు నున్నట్టి సిరుల్
కరుగగ, తరుగగ, చెదరగ
కరవుకు నెలవై నిలువగ – కవి చెన్నప్పా! 133

మధుర కవిత్వము కొరకై
మథనమ్మొనరించినావు మానసజలధిన్
సుధలను చదువరులకొసగు
పథమును చూపించినావు భళి చెన్నప్పా! 134

శవపేటికలను సైతము
నవ శాకములుగ దలంచినమిలెడి వారల్
నవభారతమున నుండగ
ప్రవచనములు పనికిరావు – పండిత చెన్నా! 135

యమకమ్ములు గమకమ్ములు
సమతూకములోన నిల్వ స్వరమధురిమలో
తమ ముత్యాలసరమ్ములు
కమనీయంబై వెలుగును కవి చెన్నప్పా! 136

కందర్పుని జనకుండై
నందుని కానందమొసగు నందనుడై గో
విందునిగ వెలుగు వానికి
కందములందించుచుంటి కవి చెన్నప్పా! 137

సుధయగు నాంధ్ర పురాణము
ప్రధితుండై వ్రాసినట్టి పండిత శ్రేష్ఠుం
డధునాతన నన్నయయగు
"మధునా పంతుల" ను గొలుతు మరి! చెన్నప్పా! 138

"నాగార్జున సాగరము"ను
రాగాత్మక దృష్టితోడ రసరమ్యముగా
వాగీశ్వరి నర్తనముగ
మాగురు దేవుండు వ్రాసె మసన కవీశా! 139

బృహదారణ్యకమును మును
సెహబాస నంగ తెనుగు చేసిన తమచే
మహబూబునగరు యశమున
నహరహమును వెలుగుచుండు నయ్యా చెన్నా! 140





మల్లి పదాలరచనతో
మల్లెల మాలలను గూర్చి మహిమాన్వితయౌ
పూల్లాబ్జాక్షిని గొలిచిన
చల్లని మానసము నీది సత్కవి చెన్నా! 141

బిరుదులవార్డులు పదవులు
సరియగు పండితుల జేర సార్థక్యమగున్
పరిశోధక జనమండన
వరణీయము నీదు వాక్కు పండిత చెన్నా! 142

"ఫణిరాజమూర్తి" వర్యుని
ఫణిశయనుడు గాచుగాక పరమాప్తుండై
గణనాధుడొసగు యశమును
గణ గణ మ్రోగంగ విజయ ఘంటిక చెన్నా! 143

అయ్యేయస్సాఫీరు
నయ్యానని గర్వపడని ఆత్మీయు డశో
కియ్యెడ కురిపించిన కృప
కుయ్యల లూగినది హృదయమో చెన్నప్పా! 144

పెదమంగళారమందున
చదివితి పద్యమ్ము నొకటి సౌరశ్రీపై
చదివించె నన్ను భానుడె
కదిలించగ జనులనెల్ల కవి చెన్నప్పా! 145

విజ్ఞాని యగు కలామును
ప్రజ్ఞామయుడైన రాష్ట్రపతి నొనరించే
విజ్ఞత గల నిర్ణయమును
విజ్ఞులు హర్షించు చంద్రు విను చెన్నప్పా! 146

నమ్మిన వారల బ్రతుకున
క్రమ్మిన కష్టమ్ములను చికాకులనెల్లన్
నమ్మకముగ తొలగించిన
"తిమ్మరుసు"ను గొలిచెదను సుధీ! చెన్నప్పా! 147

రవ్వా శ్రీహరి పలుకులు
దివ్వెల వలె వెలుగు హృదయదేదీప్యముగా
పువ్వుల వలె శోభించును
మువ్వల వలె కూర్చు మోదమో చెన్నప్పా! 148

ఘనమగు పలనాటి ప్రభను
వినసొంపగు నట్టిరీతి ద్విపదగ మలచెన్
ఘనుడగు కవి శ్రీనాథుం
డనయము నేనతని గొలుతు నయ్యా చెన్నా! 149

బుస్సీ దొరతో పోరి, య
శస్సును గడియించినట్టి సాహసి, దివ్యా
శీస్సుల చిద్రూపమ్ము, త
పస్సుల సత్ఫలము తాండ్రపాపయ చెన్నా! 150





కరకు నిజాముసు కలమను
కరవాలముతో నెదిర్చి ఖ్యాతిని గాంచెన్
వరగుణు లెల్లరు గొలువగ
సురవరము ప్రతాపరెడ్డి సుమి! చెన్నప్పా! 151

నన్నయ్యగారి పద్యము
చిన్నయ్యగారి వచనము చిత్తమునూపన్
వెన్నెలకు వన్నెలద్దెడి
చెన్నగు సత్కవిత నీది శ్రీచెన్నప్పా! 152

తనదౌ పథమున బోరుచు
మనలో జాతీయభావ మందారములన్
ఘనతరముగ పూయించెను
మన "సీతారామరాజు" మసన కవీశా! 153

కవిరాజులు కోకొల్లలు,
భువిలోగల రాజకవుల ముదముగ నెంచన్
ప్రవిమల కీర్తికి ప్రతినిధి
ప్రవచింపగ నొక్క కృష్ణరాయుడె! చెన్నా! 154

మనదైన ఆంధ్రభాషను
తనమనమున తలచి తలచి ధన్యుండై, వే
మనపై పరిశోధించెను
జనహితుడగు సీ.పి బ్రౌను సత్కవి చెన్నా! 155

జలనిధుల రెంటిమధ్యన
అలవోకగ సేతువొకటి ఆత్మీయతతో
నిలిపిన ధీరుండెవ్వన
చెలువుగ నతనిని గొలుతును శ్రీ చెన్నప్పా 156

పలురకముల విద్యార్థులు
పలుసిద్ధాంతములు చేసి పరిశోధనలో
వెలుగొందుచు సంఘములో
విలువలు స్థాపించవలయువేగమె చెన్నా! 157

సత్తువ గలిగిన రచనలు
చిత్తమ్మున నిలచినన్ను చిన్మయుజేయున్
ఉత్తుత్తి చెత్త రచనలు
చిత్తము నలరించలేవు శ్రీ చెన్నప్పా! 158

తనదైన శైలి లోపల
జనులాశించెడి "కుమారసంభవ" గాధన్
వినిచెను వీనుల విందుగ
ఘనయశుడగు నన్నెచోడ కవి చెన్నప్పా! 159

ఆ పరమాత్ముడు కృపతో
కాపాడును గాక సతము కరుణామయుడై
పాపులలోకమునందున
పాపల బోలెడు మహాను భావుల చెన్నా! 160





మన భారతమాతకు తన
మనమున గుడి కట్టి భక్తిమాలలు వైచెన్
జనవంద్యుడు ధీమంతుడు
ఘనుడైన "సుభాసు బోసు" కవి చెన్నప్పా! 161

సింగారించెను భాషను
బంగరు భావములతోడ బహువిధముల "బా
ల్గంగాధరతిలకుండు"
ప్పొంగగ కవుల హృదయములు భువిలో చెన్నా! 162

వ్యవహార భాష కొరకై
యవిరళముగ కృషిని సల్పియాంధ్రులమనముల్
చివురింప జేసె భాషా
సవనమె తలపెట్టి "గిడుగు" సత్కవి చెన్నా! 163

శ్రీ కూర్మము, ముఖలింగము
రాకాశశికాంతులీను రావివలసయున్
శ్రీ "కారా" మదిమొదలును
"శ్రీ కాకుళమ" నిన చాలు శ్రీచెన్నప్పా! 164

చొక్కపు తీయని భాషను
చక్కగ మాట్లాడ గల "విజయనగరము"లో
"మక్కువ" దర్శించినపుడు
మక్కువ నాకెక్కువగును మనసన కవీశా! 165

ఘనమగు అంబుధి తోడుగ
నినదించుచు నుండు నట్టినేలగ దోచున్
మనముల నిలిచెడి విద్వ
న్మణులున్న "విశాఖ పట్టణము" చెన్నప్పా! 166

తూ.గో. జిల్లాయనగా
నాగోదావరి తటాన అన్నవరంబున్
వాగను శాసను రచనయు
రాగాత్మకమై మెరయును రయమున చెన్నా! 167

రమణీయమైన గౌతమి
కమనీయంబైన "ద్వారకా తిరుమల"యున్
ప్రమదించును మనమును "ప
శ్చిమ గోదావరి" యనంగ శ్రీ చెన్నప్పా! 168

రాజులు, సత్కవి రాజులు
రాజిల్లెడి విజయవాడ రసవిదులిడునీ
రాజనములు మెదలును "కృ
ష్ణాజిల్లా" యనిన యంత సత్కవి చెన్నా! 169

గుంటలు, మిట్టలు, వాగులు
కుంటలు, మెరకలును, సతము గుండెలు చెదిరే
పంటలు దర్శనమొసగును
గుంటూరున అణువణువున కోవిద చెన్నా! 170





వేళాకోళము లెరుగుని
భోళాశంకరుడనంగ - పూనికతోడన్
తాళని జ్వాలగ చెలగెడు
కాళోజిని గొలుచు చుంటి కవి చెన్నప్పా! 171

ధాటిగ తనకికతానే
సాటిగ మాటాడగలిగి సౌమ్యగుణముతో
మేటిగ పేరొందిన "కో
దాటి"ని మదితలచెద సతతము చెన్నప్పా! 172

బీరము సుందరరాయుడు
పూరించెను నుస్వనమ్ము పొలికేక వలెన్
ఆ "రేపటి ముఖచిత్రం"
వీరోచిత కావ్యమందు కవి చెన్నప్పా! 173

సామాన్యుల క్లేశముల న
సామాన్యముగా మలచిన సత్కవి కే.యల్.
కామేశ్వరరావుకు నే
కామన లందించుచుంటి కవి చెన్నప్పా! 174

గజ చర్మాంబర ధారిని
రజతాద్రి నివాసుడైన రసరమ్యాత్మున్
త్రిజగన్మోహనమూర్తిని
ఖజటుని కీర్తించు చుంటి కవి చెన్నప్పా! 175

విద్యున్మాలా గర్భిత
పద్యము నా మదిని నిలువ పరవశముగనే
హృద్యమ్మగు కవితనడుప
నుద్యుక్తుడనై నిలిచితినో చెన్నప్పా! 176

కే.వీ. రమణాచారిని
పావనమగు యోచనగల పద్యహృదయునిన్
భావనలో స్వచ్ఛత గల
జీవిని నే తలచుచుంటి చెన్నప్ప కవీ! 177

మననగ్నముని రచించిన
ఘనమైన "విలోమకథలు" కడు రమ్యముగా
జనులకు చేరువ కాగా
మన సుప్పాంగినది నేస్తమా చెన్నప్పా! 178

మనమున సంస్కృత భాషా
దినమున రేకెత్తుచున్న దీప్తులతోడన్
ఘనమైనది సంస్కృతమని
వినయమ్ముగ చెప్పుచుంటివిను చెన్నప్పా! 179

తొలగింపగ పేదరికము
వెలిగింపగ జీవితములు విద్యుత్కాంతిన్
పలురీతులలో "వెలుగు"ను
కలిగించిరి తెలుగువారు కవి చెన్నప్పా! 180





స్వయము సహాయక సంస్థల
మయమై చెలువొందు లోకమందున మాదౌ
ఘయినాన్ను నిలుపుటను రస
మయముగ నుడివెదను నేస్తమా చెన్నప్పా! 181

సినిమా గీతములందున
మన "సుందర రామమూర్తి" మహితోత్తముడై
జనరంజన మొనరించగ
ఘనతరభావముల నింపె కవి చెన్నప్పా! 182

పోత్రోచితమగు మాటల
నాత్రేయ రచించి ప్రజల కానందమహో
రాత్రమ్ములు కలిగించెను
స్తోత్రము కాదిది నిజమ్ము కవి చెన్నప్పా! 183

చవులూరించెడి కవితల
నవలీలగ చెప్పి ప్రజల కానందమిడన్
సవరించెను తన స్వరమును
కవికోకిల "రామిరెడ్డి" కవిచెన్నప్పా! 184

వెనుక జగన్మోహినిగా
మనముందర కేశవునిగ మరిమరి నిలచే
ఘనతరమగు శిల్ప మొకటి
కనిపించును "ర్యాలి" యందు కవిచెన్నప్పా! 185

పలనాటి సీమయందున
విలసిల్లును "పిడుగురాళ్ల" విభవముతోడన్
కలదందు "దిడుగు" వంశము
చెలువొందితి నందు నేను చెన్నప్ప కవీ! 186

"వన్నాటు సెవెను" రూటున
అన్నార్తులు కానిపించ రదియెట్లన్నన్
చెన్నప్ప వాసమచ్చట
కన్నుల పండువును గొలుపు కవి చెన్నప్పా! 187

చంపక ముత్వల మాలల
సొంపుగ నందించి తెలుగు సోయగములనే
పెంపొందించిన కవులను
గంపెడు పుష్పాలగొలుతు కవి చెన్నప్పా! 188

పదయును జయములు, శుభములు
విడనాడని కీర్తి తోడ విభవమ్మొప్పన్
వడివడిగ కవిత జెప్పెడి
కడిమెళ్ల వరప్రసాదు కవి చెన్నప్పా! 189

రంజాను పర్వదినమున
శింజిని మ్రోగించినట్లు శీఘ్రంపుగతిన్
రంజింపగ పద్యమ్మును
మంజులముగ చెప్పుచుంటి మసన కవీశా! 190





సుందర నందన మందలి
మందారమరందమంద మందాకినిగా
అందరి నాకర్షించెడి
కందమ్మును పలుకుచుంటి కవి చెన్నప్పా!! 191

ప్రతిపదవికి వన్నియనిడు
"ప్రతిభాపాటిలు"ను రాష్ట్ర పతినొనరింపన్
ప్రతిభకు పట్టము గట్టిన
ప్రతి నిధులకు గలుగు శుభము భళి చెన్నప్పా!! 192

"మండే సూర్యుడు" తెలుగుల
గుండెలలో వెలుగుచుండు కోటి ప్రభలతో
పండితవరుడై స్మరణీ
యుండై నతులందు చుండునో చెన్నప్పా!! 193

శీతనగాధిపు తనయను
ప్రీతిగ పెండ్లాడి మిగుల ప్రేమాస్పదుడౌ
భూతగణాధిపుడే తమ
చేతములో నిలచినాడు చెన్నప్ప కవీ!! 194

ప్రేమామృత వాక్కులతో
సామాన్యుని సత్కరించు సంస్కారమతీ!
ఆమని వలె ముదమొసగును
కామితమగు మీదు కవిత కవి చెన్నప్పా!! 195

ఝుమ్మని నాదము చేసెడి
తుమ్మెదగా నవయుగాది-ద్యుతిమయముగ నా
ట్యమ్మొనరించెడి కేకిగ-
కమ్మగ కనువిందు చేయు- కవిచెన్నప్పా!! 196

హరితో స్వయముగ బోరుచు
ధరణీ ప్రియనందనుండు ధాత్రిన్ గూలన్
నరలోకమా దినమ్మును
జరుపును దీపావళిగ మసన చెన్నప్పా!! 197

శ్రీకారము స్వర్ణాంధ్రకు
ప్రాకటముగ జుట్టినారు ప్రతిభను చూపన్
లోకము మెచ్చెడి పాలన
చేకూర్చిన యదియె లెస్స శ్రీ చెన్నప్పా! 198

అలవోకగ నాలుకపై
కలకాలము నిలువ గోరి కమ్మని గతితో
వెలుగొందెడి కందాలను
చిలికించుచు నుంటి నేను శ్రీ చెన్నప్పా! 199

విరులై-ఆవిరులై-అ
త్తరులై-ఝురులై-సిరులయి-తరులై, సరులై
మెరసెడి తమ భావమ్ముల
నరయగ కందములు దూకినవి చెన్నప్పా!! 200



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డా॥ సి. నారాయణ రెడ్డి
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
కళాభవన్, హైదరాబాదు - 500 004

తేది 24-01-2000

## చెన్నుడి

మసన చెన్నప్ప పైన రసిక రాధశ్రీ రచించిన శతకమిది. "భాసుర కవితాఝురిలో మునుగుచు" విసిరిన నూరు పద్యాల జడి యిది. కవితాఝురి అని రాధశ్రీ అన్నపుడు నాకు స్ఫురించేది అతని ఆశు కవితా ఝురి. నేను ప్రత్యక్షంగా చూశాను. అలలు అలలుగా పద్యాలను ప్రస్తరించే గుణం రాధశ్రీకి పుష్కలంగా వుంది.

"శ్రీనాథుడు పద ప్రసిద్ధధారాధుని" అన్నాడు కవి సమ్రాట్ విశ్వనాథ. కందాలలో ఆ ధారను అందుకున్నవాడు రాధశ్రీ. "నందనమది చందనమది వందనమిదె స్వీకరింపవలె చెన్నప్పా" డా॥ రాధశ్రీ ధారాళ పదప్రయోగ చతురతకు ఇది మచ్చుతునక. తన చుట్టూ వున్న సత్కవులనూ, పండితమణులనూ మనసారా స్మరించుకున్నాడు. ఈ కవి. ఇష్టానిష్టాలను బాహాటంగా ప్రకటించుకున్నాడు. యుగళగీతం పాడే సినీనాయికా నాయకుల వెనుక గంతులేసే మందను "కనినంతనె డోకు వచ్చు కవి చెన్నప్పా" అంటూ ఓ విసురు విసురుతాడితడు. ఈ శతకంలో సంబోధించేది చెన్నప్పను. ప్రస్తావించేది ఎన్నెన్నో తమాషాలను.

డా॥ మసనచెన్నప్ప సత్కవి డా॥ రాధశ్రీ ఆశు ధారా విలసత్కవి. ఫలితం శతకోదయం. ఈ సంపుటిలోని ప్రతి నుడి అందంగా వుంది. ఆ చెన్నును గమనించే దీనికి మున్నుడిగా నా చెన్నుడి అందిస్తున్నాను. ఉభయకవులకూ నా అభినందనలు.

**డా॥ సి.నారాయణ రెడ్డి**

భరత్ భాషా భూషణ్
**డా|| ఆచార్య తిరుమల**
నందిని కాంప్లెక్స్, హైదరాబాదు - 500 095

తేది 24-01-2000

# సమారాధన

తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన ప్రక్రియ శతకం. శతక చరిత్ర మీద దాని గుణ దోష స్వరూప స్వభావాల మీద చాలా పరిశోధనలు జరిగాయి. చాలా వ్యాసాలు వెలువడ్డాయి. శతకం తెలుగు వారి సొత్తు. పూర్వం గువ్వల చెన్న శతకంలా ఇప్పుడు మసన చెన్నప్ప శతకం రాధశ్రీ ఈ శతక రచనలో తనను గూర్చి, కృతి కర్త మసన చెన్నప్పను గూర్చి, ఆధునిక తెలుగు సాహిత్యాన్ని జాజ్వల్యమానం చేస్తున్న విద్వత్కవుల్ని గూర్చి తెలియజేసిన విధానం - నిబద్ధతను, వస్తువును, లోకాను శీలనాన్ని మించి పరమ ఆత్మీయంగా ఉంది. శతకం ప్రధానంగా ఆత్మాశ్రయ ధోరణికి చెంది వుంటుంది. అది దాని గుణం.

రాధశ్రీకి పద్యమే హృదయం. దానితోనే ఆయన మాట్లాడుతారు. ఉద్యమాలు కూడా లేవదీస్తారు. ఆయన పద్యం పరహిత మతియగు గోదావరిలా ఉరుకులతో, పరుగులతో సరిగమలు పాడుకుంటూ సాగి పోతూ వుంటుంది. ఎవరైనా ఆయన్ని హల్లో యనగానే ఊహల్లో విహరింపజేసి ఆతీల్మియతతో పద్యకవితలల్లి ఉల్లం ఝుల్లనిపిస్తారు. ఆయన తెలుగు భాషా సాహిత్యాలు డిగ్రీల కోసం చదువలేదు. కామర్సులో పిహెచ్.డి. తీసుకున్న మేధావి రాధశ్రీ. ఆయన ధారణాశక్తి అసాధారణం. ఆది కవి నుండి ఆచార్య తిరుమల వరకు గల ప్రశస్తమైన పద్యాలన్నీ ఆయన ప్రదర్శలల్లో నవ్య చైతన్యాన్ని సంతరించుకుంటూవుంటాయి. ఆయన తెలుగు పద్యానికి పునః ప్రతిష్ఠని, పునరుత్తేజాన్ని కలిగిస్తున్న సహృదయ శేఖరులు. ఈ శతకం రాధశ్రీ కవితా ధారణకు కూడా ఒక మచ్చు తునక.

రాధశ్రీ ఈ శతకాన్ని డా|| మసన చెన్నప్ప గారికి చెప్పి, ఆయనకే అంకితం చేయటం అస్మదాదులకు ఆనందదాయకంగా ఉంది. ఎందుకంటే ఇరువురూ పద్య ప్రియులు, సంప్రదాయాభిమానులు. దేశభక్తి పరాయణుల, భక్తి భావావేశ సంపన్నులు - విశేషించి మాకు పరమాప్తులు.

ఆత్మీయ కవిమిత్రులు డా|| చెన్నప్ప గారు వైదిక భావంతో తమ జీవతాన్ని సారస్వత సేవకు అంకితం చేసిన ఆర్షధర్మానుగాములు. బృహదారణ్యకోపనిషత్తును 'బృహద్గీత' గా మాత్రా ఛందస్సులో వెలువరించిన అపార ధిషణా సంపన్నులు. నిత్య సత్యాన్వేషణాతత్పరులు. పండిత గోపదేవుల అంతేవాసిత్వంలో వేదశస్త్రపురాణేతిహాస రహస్యాలు గ్రహించి, సత్పథమేదో నిర్దేశిస్తూ, ఒక విలక్షణ శైలితో ఆధునిక తెలుగు సాహిత్యరంగంలో నిర్దిష్ట గమ్యాన్ని చూపిస్తున్న మేధావి. డా|| చెన్నప్పగారు అటు పద్యకవుల్ని, ఇటు వచన కవుల్ని మెప్పించిన కవితా కళా మర్మజ్ఞులు. ఆయన పరిశోధనాత్మక వ్యాసాలు వాణీ దరహాసాలు. ధర్మనిష్ఠ ఆయన ఊపిరి. భారతీయ వైదిక సంప్రదాయం ఆయన జీవన పథం. ఈ విషయం తెలిసే రాధశ్రీ "వఱ్రీలకు గురి చేసెడి సఱ్రియలిజమేల మనకు సఖ! చెన్నప్పా!" అన్నారు. కృతి భర్త భావాము గుణంగా రచన సాగించటం కవికి ప్రాథమిక ధర్మం.

శతకములో ప్రతి పద్యము
పతకము వలె మెఱయుచుండు ప్రతిభ దలిర్పన్
గతుకుల పథమును బోలెడి
బ్రతుకున పన్నీటి జల్లు పద్యమె చెన్నా!!

అని చెన్నప్ప గరిని రధశ్రీ పద్యాల పన్నీటి జల్లులో ముంచెత్తారు. ఈ బంధంలో ఒక స్నేహ గంధం ఉంది. దాన్ని అక్షరాన్ని మించి ఆఘ్రాణించ వలసి ఉంది ప్రయత్నించండి.

విద్యద్విధేయుడు
**ఆచార్య తిరుమల**

**డా॥ రాధశ్రీపైన కురిసిన ఆత్మీయుల ఆశీర్వర్షం . . .**

పలుకులో, ప్రవర్తనలో కవిత్వం కదలాడే వ్యక్తిత్వం డా॥ రాధశ్రీది . మూడు ప్రక్రియల్లోనూ నిరంతరం రచనలు చేస్తున్న నిత్య కవితా సాధకుడు, అశుధారా విలసత్కవి డా॥ రాధశ్రీ.

*డా॥ సి. నారాయణ రెడ్డి*

రాధశ్రీ రసపద్య విద్యవలె రారాజిల్లు వెయ్యేండ్లుగా,
వీధిన్ వీధిన ధారణా పటిమలన్ విస్తారమున్ జేయుచున్,
మేథో సంపదకింపు నింపగ సమున్మేషింప, వి
ద్యాధారేశ్వరి సత్కృపాగరిమ సద్యస్ఫూర్తి సంధిల్లగన్

*శతావధాని జి.యం. రామశర్మ*

రాధశ్రీ రసనాగ్రసీమ రసవద్రమ్యాక్షరక్షోణి హే
లాధారా జలపాత వేగ సరణిన్ లక్ష్యైక దీక్షాస్ఫుర
న్మేధోగాధ పయోధి నిస్సృత కళా నీరాజనంబౌను, త
ద్బోధామేదుర మాధురీధుని పురా పుణ్యార్చనశ్రీ సుమీ!!

*ఆ.మ. పురుషోత్తమాచార్యులు*

రాధకుడక్షరావళికి, రమ్యకవిత్వ కళా తపస్వి, సం
శోధన తత్వ నిష్టుడు, విశుద్ధ పురాకవి కావ్య వాక్సుమా
రాధకు డాశుపద్యకృతి రాగసుధల్ వెలయించి సాహితీ
శ్రీధరుడై వెలుంగు చిరజీవన మోహన రాగయుక్తుడై

*డా॥ అయాచితం నటేశ్వర శర్మ*

మేధాశక్తి ప్రచోదిత ప్రకర సామీ చీన్య సద్భావనా
శోధల్ మెండు వెలార్చుచుండు రసవత్ శోభానిధానాత్త!! స
ద్గాథల్ ధారణ చేయు సద్యశుడ!! ఉద్దండోగ్రధారా ధునీ!!
రాధశ్రీ విజయోస్తు! పద్యకవితా రాజ్యమ్ముపై నిల్వుమా!!

*రాళ్లబండి కవితా ప్రసాద్, సాంస్కృతిక శాఖ, ఆం.ప్ర.*